THE ANDHRA PATRIKA, MADRAS.



# ఆంధ్రపత్రిక

3|8072



Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 173 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO. సోమవారం 24-9-1951 వెల 1 అణా, హాఫ్ 0-1-2.

# ఎన్నికల నిర్వహణలో పాల్గొనే ప్రభుత్వోద్యోగులకు ప్రత్యేక శిక్షణ

## కమ్యూనిస్టుపార్టీపై నిషేధానికి ఆస్ట్రేలియా ప్రజల ప్రాతికూల్యం

### రిఫరెండంలో ప్రధాని మెంజీస్‌కు ఓటమి

మెల్బోర్న్, సెప్టెంబర్ 23: కమ్యూనిస్టుపార్టీని నిషేధించటానికి అధికారం ఇవ్వవలసినదని కన్సర్వేటివ్ ప్రధాని మెంజీస్ అడిగిన కోరికను ఆస్ట్రేలియా ప్రజానీకం తోసిపుచ్చారు.

శనివారం నాడు అర్ధరాత్రి వరకూ వచ్చిన ఫలితాలనుబట్టి, ఈ సమస్యపై ఏర్పాటు చేయబడ్డ రెఫరెండంలో 18,78,000 మంది నిషేధానికి వ్యతిరేకంగానూ, 17,08,000 మంది ఆమోదాన్నీ తెలియజేశారు. మొత్తం వోట్ల సంఖ్యలో కానీ, తనను ఆమోదించే రాష్ట్రాల సంఖ్యలో కానీ, కన్సర్వేటివ్ ప్రధాని అపజయం పొందినట్లు నిశ్చయంగా తెలిసిపోయినది.

కమ్యూనిస్టు పార్టీని నిషేధిస్తూ ఆస్ట్రేలియా ప్రభుత్వం ప్రతిపాదించిన బిల్లు రాజ్యాంగ విరుద్ధమని ఆస్ట్రేలియా హైకోర్టు గడచిన మార్చిలో తీర్పు చెప్పినది. ఆ బిల్లును మళ్లీ ప్రతిపాదించవలెనంటే, ప్రభుత్వం జనవాక్యం జరిపి, మొత్తం వోట్ల సంఖ్యలోనూ, తనను ఆమోదించే రాష్ట్రాల సంఖ్యలోనూ గెలవవలసి ఉన్నది. కాని ఈ రెండు అంశాలలోనూ ప్రభుత్వం అపజయం పొందినట్లు ఇప్పటివరకూ వచ్చిన ఫలితాలనుబట్టి తేలి పోయినది.

కన్సర్వేటివ్‌లతో కలిసి మిశ్రమ ప్రభుత్వంలో పాల్గొంటున్న లిబరల్ పార్టీ నాయకుడు లైల్ మూర్ రెఫరెండంలో ఓటమిని అంగీకరిస్తూ ప్రకటన చేశారు. "ప్రజాస్వామిక పద్ధతిలో ప్రజలు తమ అభిప్రాయాన్ని వెల్లడించారు. దానిని మేము పాటిస్తాము" అని ఆయన అన్నారు.

అయితే ప్రధాని మెంజీస్ మాత్రం ఓటమిని ఇంకా అంగీకరించటంలేదు. ఏది ఎట్లా ఉన్నా, తాను కమ్యూనిస్టుల మీద పోరాటం సాగిస్తూనే ఉంటానని ఆయన అన్నారు. ప్రతికూల పక్షనాయకుడు (లేబర్) డిక్సన్ ఒక ప్రకటనచేస్తూ, రెఫరెండంలో ప్రభుత్వం ఓడిపోయినదని అన్నారు.

వోట్ల లెక్కింపు ప్రారంభమయిన కొద్దిసేపటికే ప్రజలు ఈ రెఫరెండాన్ని పార్టీ విషయంగా కాక, జాతీయ సమస్యగా పరిగణించినట్లు స్పష్టపడ్డది. ప్రభుత్వ దృక్పథాన్ని వారు ఆమోదించటంలేదని మొత్తం ప్రభుత్వ పక్ష విజయస్థానాల్లో కొన్నింటి స్థానాల్లో రెఫరెండం ఓటమివల్ల త్వరలో తేలిపోయింది. ప్రభుత్వ పక్షానికి 23 స్థానాలున్న న్యూసౌత్ వేల్స్ రాష్ట్రం రెఫరెండం ఫలితాలు వస్తున్న కొద్దిసేపటికే, 8 ప్రభుత్వ స్థానాలు విముఖతను ప్రకటించినవి.

**ముద్గల్‌పై బహిష్కరణ తీర్మానం**

న్యూఢిల్లీ, సెప్టెంబరు 22: హెచ్. జి. ముద్గల్‌ను పార్లమెంటునుండి బహిష్కరించడానికి సభానాయకుడు నెహ్రూ సోమవారం నాడు పార్లమెంటులో ఒక తీర్మానం ప్రతిపాదిస్తారని తెలుస్తున్నది. కాని కిందివిధంగా ఒక తీర్మానాన్ని ప్రతిపాదించదలచినట్లు నెహ్రూ నోటీసు ఇచ్చారు:—

పార్లమెంటు సభ్యుడు శ్రీ హెచ్. జి. ముద్గల్ ప్రవర్తన గురించి విచారణసంఘం సమర్పించిన నివేదికను పరిశీలించి ఈ సభవారు తీర్మానించేదేమనగా, ముద్గల్‌గారి ప్రవర్తన పార్లమెంటు సభ్యునికి ఎంతమాత్రమూ తగివుండకపోవడమే గాక ఈ సభకు అప్రతిష్ఠ కల్గించేదిగానూ వుంది. శ్రీ ముద్గల్‌గారిని ఇందుమూలంగా పార్లమెంటునుంచి బహిష్కరించడానికి నిశ్చయించడమైనది.

## ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థ గ్రీస్ టర్కీలకు చేయగల సహాయం

### పరిశీలనకు త్వరలో ఓమార్ బ్రాడ్లీ ప్రయాణం

వాషింగ్టన్, సెప్టెంబరు 22: ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థలో గ్రీసు టర్కీలు భాగస్థులుగా చేరినందువల్ల ఆ వ్యవస్థకు అవి చేయగల్గిన మిలిటరీ సహాయం ఏమిటో దాని పరిమాణం ఎంతో ఆ దేశాల సేనానులతో చర్చించే నిమిత్తం అమెరికా సేనానాయక మండలి అధ్యక్షుడు జనరల్ ఓమార్ బ్రాడ్లీ ఆ దేశాలకు త్వరలో సైనికులు దేరి వెళ్ళనున్నట్లు విశ్వసనీయంగా తెలియవచ్చింది.

గ్రీసు టర్కీలను ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థలో ఏకీకరించే ప్రక్రియలో రాజకీయమైన భాగం ఒకటీ, మిలిటరీకి సంబంధించిన భాగం ఒకటి రెండు భాగాలు ఉన్నాయి; అమెరికా ముందు ఈ మిలిటరీకి సంబంధించిన భాగాన్ని పూర్తిచేయాలని తొందర పడుతున్నది.

గ్రీసు టర్కీలను ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థతో అనుబంధించే కార్యక్రమాన్ని అధ్యక్షుడు ట్రూమన్ తన ప్రత్యేక సలహాదారు ఎవరెల్ హారిమన్, జనరల్ ఓమార్ బ్రాడ్లీలకు అప్పగించి పెట్టినట్లు న్యూయార్కు టైమ్సు ఈ వేళ ప్రకటించింది. హారిమన్ బ్రాడ్లీ గ్రీసు టర్కీలకు 10 రోజుల్లో బయలుదేరి వెళ్తారని కూడా ఆ పత్రిక వెల్లడించింది.

తన పొరుగునవున్న టర్కీ ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థలో చేరిపోవటం తనకు ప్రమాదకరంగా రష్యా భావించవచ్చుననీ విదేశాలకు మిలిటరీ స్థావరాలు ఇవ్వవద్దని కోరుతూ రష్యా టర్కీకి ఒక సందేశం పంపవచ్చుననీ, అంకోరాలోని రాజకీయ పరిశీలకులు ఊహిస్తున్నారు.

### నావికుల తరిఫీదుకు కేంద్రప్రభుత్వ పథకం

మదరాసు, సెప్టెంబరు 21: నావికాశక్తియందు భారత జాతీయుల సంఖ్యను వృద్ధిపరచేనిమిత్తం ఇండియా ప్రభుత్వం నావికుల తర్ఫీదుకు ఒక స్కీము తలపెట్టినది. ఈ తర్ఫీదు 8 నెలల పర్యంతరము భోజనము, వసతి స్థలం ఉచితముగా నొసగే పద్ధతిని యివ్వబడుతుంది. ఇదిగాక తర్ఫీదు పొందువారికి నెలకు రూ 2-8-0 అలవెన్సుకూడా యిస్తారు. దరఖాస్తు దార్ల వయస్సు సామాన్యంగా 18 నుండి 25 లోపు ఉండాలి.



## కలెక్టర్ల సభ నిర్ణయం

### దాదాపుమూడున్నర లక్షలమందికి తరిఫీదు: అక్టోబర్, నవంబర్, డిసెంబర్ నెలల్లో తరగతులు

మదరాసు, సెప్టెంబరు 23: జనరల్ ఎన్నికల ఏర్పాట్లు గూర్చి చర్చించుటకు నిన్నటినుంచి ఇక్కడ జరుగుతున్న కలెక్టర్ల సమావేశంలో ఎన్నిక ఉద్యోగులకు శిక్షణతరగతులు ఏర్పాటుచేయాలని నిశ్చయించారు.

కలెక్టర్లు వారి స్వస్థానాలకు తిరిగి వెళ్లిన తరువాత మొదట్లో వారికి క్రింది గజెటెడ్ ఉద్యోగులకు శిక్షణ తరగతులు ఏర్పాటు చేస్తారు. వారు తరువాత వారి క్రింది ఉద్యోగులకు శిక్షణ ఇస్తారు.

ఈ శిక్షణ తరగతులు అక్టోబరు నవంబరు డిసెంబరు నెలల్లో మూడు సార్లు జరుగుతాయి. జిల్లాలో వివిధ కేంద్రాలలో జరిగే ఈ శిక్షణ తరగతులకు ప్రతి పోలింగ్ ఆఫీసరు విధిగా హాజరు కావలసి వుంటుంది. ఈ సందర్భమున మొత్తం షుమారు 3 లక్షల 50 వేల మందికి శిక్షణ ఇవ్వవలసి వుంటుందని అంచనా వేయబడింది.

ముఖ్యమంత్రి ఉపన్యాసాంతరం (నిన్ననే ప్రకటించబడింది.) ఎన్నికల ఏర్పాట్లు, ఓటర్ల జాబితాల ప్రకటన విషయంలో ఇంతవరకు జరిగిన పనిని సమావేశమైనవారు సింహావలోకనం చేసుకున్నారు. పోలింగ్ కేంద్రాలు, నామినేషన్ పత్రాల స్వీకరణ ఓట్ల లెక్కింపు మొదలయిన అంశాలను గూడా చర్చించారు. నిన్నటి సమావేశానికి ఆర్థిక మంత్రి శ్రీ గోపాల రెడ్డి, ప్రధాన కార్యదర్శి శ్రీ కె. రాముని మీనన్ ప్రధాన ఎన్నికోద్యోగి శ్రీ యస్. వెంకటేశ్వరన్ హాజరయ్యారు.

### కొనుగోలుశక్తి లేనివారికి గంజి సహాయం

మదరాసు, సెప్టెంబరు 23: నిన్నటి నుండి ఇక్కడ జనరల్ ఎన్నికల ఏర్పాట్లగూర్చి చర్చించుటకు సమావేశమవుతూవున్న కలెక్టర్లలో రివిన్యూ కార్యదర్శి ప్రధానమంత్రి నిధినుండి అవసరమైనచోట్ల గంజిపోసే కేంద్రాలను ఏర్పాటుచేయుటకు అందిన విరాళమును వినియోగించుట గూర్చి చర్చించారు. ఒకపూట తిండికూడా సంపాదించుకొనే కొనుగోలుశక్తి తగ్గినచోట్ల ఖర్చు కాకుండావున్న రు. 91000 లను వినియోగిస్తే బాగుంటుందని కలెక్టర్లు సూచించినట్లు తెలుస్తోంది.

ఈ సందర్భంలో కలెక్టర్లు రాజకీయ బాధితులకు భూ ప్రదాన కార్యక్రమమును త్వరగా ముగించుటగూర్చి గూడా చర్చించారు.

సర్వార్థ సహకార సంఘాలవ్యవస్థ గూర్చికూడ చర్చ జరిగింది. కలెక్టర్లు ఆహారసేకరణ, పంపిణీలు క్రమంగా జరిగే నిమిత్తం సర్వార్థ సహకార సంఘాలపట్ల సుముఖంగావున్నా జనరల్ ఎన్నికలపనిలో నిమగ్నులై వున్నందున ఈ విషయమును సావకాశంగా, సమగ్రంగా పరిశీలించి తీర్మానమునకు రావటం మంచిదనే అభిప్రాయంలో వున్నట్లు తెలుస్తోంది.

### ఈ 30వ తేదిన కర్ణాటక కాంగ్రెసు సమావేశం

గుంటూరు, సెప్టెంబరు 23: స్వామీ సీతారాం ప్రభృతులు విజయాశ్రమానికి వెళ్ళడంతో, ఆంధ్ర మహోద్యమాల నిర్వాహకత్వం గా ఉన్నది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణసమస్యనుగురించి చర్చించేందుకు కర్ణాటక ప్రదేశ్ కాంగ్రెసుసంఘం, యీ 30వ తేదీన సమావేశమవుతున్నట్లు యిక్కడకు తెలియవచ్చింది. (స్వ. వి.)

## 'దీర్ఘాయుష్మంతులై రానున్న నూతనరాష్ట్రానికి సేవచేయండి'

### స్వామీ సీతారాంకు మష్రువాలా అభినందన: రాజెన్‌బాబు ప్రభృతుల సందేశ పరంపర

గుంటూరు, సెప్టెంబరు 23: స్వామీ సీతారాం తమ ప్రాయోపవేశం విరమించినందుకు తమ హర్షాన్ని వెల్లడిస్తూ, భారతదేశం నలుమూలలనుండీ, అభినందనలు టెలిగ్రాముల ద్వారా, ఉత్తరాల ద్వారా పరంపరగా వస్తున్నవి. ఈ రోజున డా॥ రాజేంద్ర ప్రసాద్, రామానందతీర్థ, లండన్‌లోని ఆంధ్రులు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డి, కడప కోటిరెడ్డి పప్పు సోమసుందరం గారలు స్వామీజీని అభినందిస్తూ టెలిగ్రాములు పంపారు. పంచాయతీ బోర్డులు పురపాలక సంఘాలు, అనేక ప్రజాసంస్థలు పందలాది వ్యక్తులు స్వామీజీని అభినందిస్తూ ఉత్తరాలు వ్రాశారు.

**మష్రువాలా సందేశం**

స్వామీజీ ప్రాయోపవేశం విరమించినందుకు హర్షం వెల్లడిస్తూ, కె. జి. మష్రువాలా యీ టెలిపంపారు: "మీ ప్రాయోపవేశం విరమణవల్ల, వార్ధామిత్రులకు చాలా మనశ్శాంతి కలిగింది. ప్రాయోపవేశం సంతృప్తికరంగా విరమించినందుకు మీకు హృదయపూర్వక అభినందనలు. సూచించగా అవతరించబోయే ఆంధ్ర రాష్ట్రాన్ని ... సంతుష్టం చేయగలిగేటట్టు మీకు దీర్ఘాయుర్దాయము, శక్తిసామర్థ్యాలు ప్రసాదించుగాక. చిరకాలంవాంఛితం నెరవేరుతున్నందుకు ఆంధ్రులతోపాటు నేనూ ఆనందిస్తున్నాను. సర్వోదయ సిద్ధాంతాలను అమలుపరచ గలుగుటకు ఆంధ్రులు యీ పదవకాశాన్ని వినియోగించుకొందురుగాక.

స్వామీజీ ప్రాయోపవేశం విరమణపట్ల హర్షం వెలిబుచ్చుతూ రామేశ్వరి నెహ్రూ టెలిపంపారు."

**వినయాశ్రమానికి స్వామీజీరాక**

గుంటూరు, సెప్టెంబరు 22: స్వామీ సీతారాం ప్రభృతులు యీ సాయంకాలం వినయాశ్రమం చేరుకున్నారు.

### పాకిస్తాన్ పత్రికల అభూతకల్పన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 23: కాబూల్‌లో జరుగుతున్న రేడియో ప్రచారం పత్రికల ప్రచారం యీవర్తమానం అక్కడి భారతీయ రాయబార కార్యాలయంలో సాంకేతిక శాఖోద్యోగిగా పనిచేస్తున్న జి. ఎల్. పూరీ గారే నడుపుతున్నారని పాకిస్తాన్ పత్రికలు ఈ మధ్య కొన్ని వదంతులు ప్రకటించాయి; ఈ వదంతులు సత్య దూరాలనీ, ఇండియా ఆఫ్ఘనిస్తాన్‌ల మధ్య పొరపొచ్చాలు పెట్టడానికి ఇది పాకిస్తాన్ పత్రికలు చేసే ప్రయత్నమని, భారత ప్రభుత్వం ఈ వేళ ప్రకటించింది.

## 'గంగా' చిత్రం టెలివిజన్

బొంబాయి, సెప్టెంబరు 22: ఫ్రాంక్ సెరిన్ అనే ప్రసిద్ధ హాలీవుడ్ టెలివిజన్ సంస్థ అధిపతి ఆధ్వర్యాన ఆరుగురు హాలీవుడ్ నిర్మాతలు ఇండియాలో 20 వేల అడుగుల టెక్నికలర్ చిత్రాన్నొక దానిని తయారుచేయటం ప్రారంభించారు. దీనిని అమెరికాలో టెలివిజన్ ద్వారా ప్రసారం చేస్తారు.

మైసూరు అడవుల్లో, ఏనుగులను పట్టుకొనటానికి సంబంధించిన ఈ చిత్రం పేరు 'గంగా'. వినో మార్సెల్ అనే 14 ఏళ్ల హాలీవుడ్ కుర్రవాడు కథానాయకుడైన మావటీ కుర్రవాడి వేషం వేస్తాడు.

నేడు బొంబాయి గేట్‌వే ఆఫ్ ఇండియా దగ్గర ఒక పాములవాడి దృశ్యంతో చిత్రం తీయటం ప్రారంభమయింది.

అనేక అరవచిత్రాలు డైరెక్టుచేసిన ఉన్న ఎలిస్. ఆర్. డంగన్ ఈ చిత్రనిర్మాతల్లో ఒకరు.

## హైద్రాబాద్ ప్రముఖ కమ్యూనిస్టు రావి నారాయణ రెడ్డిగారి అరెస్టు

### అజ్ఞాతవాసంనుంచి బయటికి తిరిగివచ్చిన 24 గంటల్లోపునే సంస్థానప్రభుత్వ చర్య

హైదరాబాదు, సెప్టెంబరు 23: నిన్న ఉదయమే అయిదేండ్ల అజ్ఞాతవాసంనుంచి బయటపడిన కమ్యూనిస్టు అగ్రనాయకుడు రావినారాయణరెడ్డిగారిని ఇవాళ ఉదయం 7 గంటలకు మొఅజ్జాంజాహీ మార్కెట్టు లోని ఆయన బావగారి యింటివద్ద అరెస్టు చేశారు.

**తెలంగాణా హింసా పోరాటం పట్ల అసమ్మతి**

హైదరాబాదు, సెప్టెంబరు 22:— అజ్ఞాతవాసంనుంచి, అర్ధాంగితో సహా ఆకస్మికంగా ఇవాళ బయటపడిన హైదరాబాదు కమ్యూనిస్టు అగ్రనాయకుడు రావి నారాయణరెడ్డిగారు నేటరేపట తన పక్షాధరులందరినీ కలుసుకొని, తన భవిష్యత్ కార్యక్రమాన్ని గూర్చి ఒక ప్రకటన చేయబోతున్నారు.

నారాయణరెడ్డిగారు 1946 అక్టోబరులో నిజాం ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని నిషేధించినప్పటినుంచి అజ్ఞాతవాసంలోనే ఉన్నారు. పోలీసు చర్యకు కొద్దికాలం ప్రభుత్వం ఆ నిషేధాన్ని తొలగించినా ఈయన మాత్రం బయటపడలేదు. పోలీసుచర్యతర్వాత మిలిటరీ ప్రభుత్వం పదరు కమ్యూనిస్టు పార్టీని మళ్లీ నిషేధించింది.

అజ్ఞాతవాసంనుంచి బైటికి వచ్చిన పిమ్మట మొట్టమొదటిసారిగా ఇవాళ సాయంత్రం ఆయనను చూడబోయిన ఆంధ్రపత్రిక విలేఖరిని రెడ్డిగారు చిరునవ్వుతో అభినందించి ఆదరించారు. కాని, ఇప్పట్లో ఇంటర్వ్యూ ఇవ్వటానికి ఏమీ చెప్పలేనన్నారు.

"మీరిప్పుడు బైటపడ్డారు కాబట్టి మీపట్ల ప్రభుత్వవైఖరి యిప్పుడెలా వుంటుం"దని అడగ్గా, "ఆ సంగతి యిప్పుడప్పుడే నాకేం తెలుస్తుంది?" అని రెడ్డిగారు చెప్పారు. "ఎన్నికల్లో పోటీ చేస్తారా?" అని అడగ్గా "అదీ యిప్పుడేమీ చెప్పలేనన్నా"రు.

రెడ్డిగారు మనిషి కొంచెం చిక్కిపోయినట్టు కనిపించారు కాని, ఉత్సాహ ఉత్తేజాలుత్సాహం మాత్రమూ తగ్గిపోలేదు.

ఈయన బయటపడిన వార్తను ఒకానొక ఉన్నత అధికారవర్గ ప్రతినిధికి తెలుపగా "ప్రభుత్వంవారుపూర్వోత్తర పరిస్థితులను సావధానంగా గమనిస్తున్నా"రని ఆయన చెప్పాడు.

నారాయణ రెడ్డిగారు ఆంధ్ర మహాసభ (దీనిపైనా నిషేధం ఉంది) ఉపాధ్యక్షులైన ఎ. యస్. రెడ్డిగారిని ఇవాళ కలుసుకొని, ఆయనతో చాలాసేపు సంభాషించారు.

తెలంగాణా హింసా పోరాటంపట్ల తన అసమ్మతిని తెలియజేస్తూనూ, హింసా కాండను పూర్తిగా మాను కొని, తన ఆశయసిద్ధికి న్యాయ బద్ధమైన పద్ధతులను అవలంబించవలసిందిగా కమ్యూనిస్టులకు విన్నవిస్తూనూ ఆయన త్వరలోనే ఒక ప్రకటన చేయనున్నట్లు కమ్యూనిస్టు వర్గాల్లోనే అనుకొంటున్నారు.

రానున్న ఎన్నికల్లో నారాయణ రెడ్డిగారు పోటీ చేస్తారనే చాలామంది విశ్వసిస్తున్నారు.

**కమ్యూనిస్టుల అరెస్టు**

హైదరాబాదు, సెప్టెంబరు 23: కమ్యూనిస్టులుగా చెప్పబడుతున్న సి. హెచ్. రాజేశ్వరరావు, శ్రీధర్, సంగారాం అనే ముగ్గురిని నిన్న రాత్రి హైదరాబాదు పోలీసులు అరెస్టు చేశారు.

## సికిందరాబాద్ కార్పొరేషన్ ఉప ఎన్నిక

### ఇద్దరు సోషలిస్టు అభ్యర్థుల గెలుపు

హైదరాబాదు, సెప్టెంబరు 22: ఆ సభ్య కె. టి. తాతాచారి, కె. టి. నరసింహాచారిగార్లు రాజీనామాలు పెట్టడం మూలంగా సికిందరాబాదు కార్పొరేషన్లో ఖాళీపడిన రెండు స్థానాలకూ నిన్నటిదినం ఉపయెన్నిక జరిగింది. శ్రీ యస్. బి. గిరి, శ్రీ వెంకటేశం అనేవారు (సోషలిస్టులు) గెలిచారు. బాబయ్య, రామదాసు అనేవారు ఈ ఎన్నికలకు కాంగ్రెసు పేరుతో నిలిచారు కాని ప్రదేశ కాంగ్రెసువారు వారికి కాంగ్రెసు టికెట్లు నిరాకరించారు. అయితే ప్రదేశ కాంగ్రెసు వారి తాఖీదు వారికి ఆఖరుక్షణంలో అందినందువల్ల వారు తమ అభ్యర్థిత్వాలను ఉపసంహరించుకోలేకపోయారు.

## కొరియా యుద్ధ విరమణ చర్చలు: రిడ్జివే ప్రతిపాదన

### కమ్యూనిస్టుల లేఖకు సేనాని సమాధానం

టోకియో, సెప్టెంబరు 23: కొరియా యుద్ధవిరమణ సంభాషణలు పునః ప్రారంభించే నిమిత్తమై ఉభయ పక్షాల సంతృప్తికరమైన షరతులపై అంగీకారం కుదుర్చుకొనడానికి రేపు లెయిజాన్ అధికారుల సమావేశం జరగాలని సమితి సర్వసైన్యాధిపతి జనరల్ రిడ్జివే ఈ రోజున ప్రతిపాదించారు.

కేసాంగులో యుద్ధవిరమణ సంభాషణలు తిరిగి వెంటనే ప్రారంభించాలని కోరుతూ సెప్టెంబరు 20 వ తేదిన కమ్యూనిస్టు సైన్యాధిపతులు పంపిన సందేశానికి సమాధానంగా జనరల్ రిడ్జివే పై ప్రతిపాదన చేశారు.

కేసాంగు ప్రాంతపు తటస్థ్యాన్ని భగ్నపరుస్తూ సమితిబలాలు జరిపిన చర్యల విషయం ఇంకా అపరిష్కృతంగా ఉన్నదని కమ్యూనిస్టులు సూచించారు. వారి వాదనను నిరాకరిస్తూ ఆ విషయం పరిష్కారమైనదని రిడ్జివే తెలియపరిచారు.

కమ్యూనిస్టు సైన్యాధిపతుల పేరిట పంపిన ఈ సందేశాన్ని నేటి ఉదయం 8-30 గంటలకు పాన్ మున్ వద్ద ఒక కమ్యూనిస్టు లెయిజాన్ అధికారికి అందచేయడమైనది.

కమ్యూనిస్టు సైన్యాధిపతుల లేఖకు సమాధానం పంపకుండా, యుద్ధ విరమణ సంభాషణల పునః ప్రారంభం ఆలస్యం అయ్యేటట్లు చేయడానికి రిడ్జివే ప్రయత్నిస్తున్నాడని పెకింగు రేడియో నిరాకరించినది. అమెరికన్ యుద్ధవిమానాలు ఇంకా కేసాంగ ప్రాంతపు తటస్థ్యాన్ని భగ్నపరుస్తూనే ఉన్నవని కూడా ఆ రేడియో ప్రకటించినది.

మరొకవంక సమితి ఆర్మర్డ్ సైన్య దళం ఒకటి శుక్రవారంనాడు 8000 గజాల దూరంవరకు కమ్యూనిస్టుల ఆక్రమణలో ఉన్న ప్రదేశంలోనికి చొరబడి పోయినది.

నిన్న అపరాహ్ణం 84 అమెరికన్ జెట్ విమానాలు దాదాపు 35 ఎమ్. ఐ. జి. విమానాలతో పోరాడి, వాటిలో మూడింటిని ధ్వంసంచేసినట్లు విమానబలం ప్రకటించినది.

పెద్ద ఎత్తున ఎదురుదాడి జరపడానికి తగినంతటి ప్రబలమైన కమ్యూనిస్టు సైన్యం కొరియాలో సమీకరించబడి ఉన్నట్లు తెలుస్తున్నది.

## అభివృద్ధి కార్యక్రమాలకై అదనంగా 40 కోట్ల ఖర్చు

### ప్లానింగ్ కమిషన్‌కు సప్లిమెంటరీ నివేదిక: మంత్రి భక్తవత్సలంగారి ప్రకటన

కోయంబత్తూరు, సెప్టెంబర్ 23: రాష్ట్రంలో అభివృద్ధి కార్యక్రమ నిర్వహణకై రాష్ట్రప్రభుత్వం మరి నలభైకోట్ల రూపాయల ఖర్చుతో సప్లిమెంటరీ పథకాన్ని తయారుచేసి ప్లానింగ్ కమిషనుకు నివేదించినదని పబ్లిక్ వర్క్సుమంత్రి భక్తవత్సలంగారు నేడిక్కడ ప్రకటించారు.

ఈ కార్యక్రమ పర్యవసానం విదేశీ పెట్టుబడి, సహాయాలమీద ఆధారపడి ఉంటుందని ఆయనఅన్నారు.

ప్రస్తుతం రాష్ట్రంలో అంతటా నిర్మాణంలో ఉన్న ప్రాజెక్టులన్నీ కలిసి వచ్చేయూడు సం॥ ల లోనూ అదనంగా ఏడాదికి 3½ లక్షటన్నుల ఆహారపదార్థాలను పండించగలగటమే కాక, విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని రెండింతలు చేయగలవని ఆయనఅన్నారు.

ఇంకా ఆయన ఈ కిందివివరాలను తెలియజేశారు.

"తుంగభద్రాప్రాజెక్టు పూర్తిఅయినప్పుడు అదనంగా 40 వేల కిలోవాట్ల శక్తిని ఉత్పత్తిచేస్తుంది. ప్రస్తుతం పని చేస్తున్న విద్యుదుత్పత్తి కేంద్రాల్లో కొన్నిటికి అదనపుయంత్రాలను తగిలించటం జరుగుతున్నది. ఈ అదనపుశక్తి వల్ల ప్రస్తుతంసప్లయిఅవుతున్న 11 వేల గ్రామాలకే కాక మరికొన్నిటికి కూడా శక్తిలభిస్తుంది.

నీటిపారుదల పథకాల్లో భవానీ సాగర్ ప్రాజెక్టు వచ్చే ఏడాదికీ, తుంగభద్ర ప్రాజెక్టు 1953 లోనూ పూర్తి అవుతవి. మొదటిదానికి 8 కోట్లూ, రెండవదానికి 17 కోట్లూ ఖర్చుఅవుతుంది. మొదటిదానికింద 2 లక్షల ఎకరాలూ, రెండవదానికింద 3 లక్షల ఎకరాలూ సాగుఅవుతవి. మలంపుంఝ (మలబార్) ప్రాజెక్టు 1952 చివరకు పూర్తిఅవుతుంది.

## విశ్వభారతి విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవం

### మౌలానా అజాద్ ఉద్బోధ

శాంతినికేతనం, సెప్టెంబరు 22: "విశ్వభారతి ఇంతవరకు అనుసరిస్తున్న ఉన్నత ఆశయాలను సత్సంప్రదాయాలను పోషించి రక్షించి గురుదేవుని ఆశయాలను నెరవేర్చండి. ఇతర విశ్వవిద్యాలయాలకు మార్గదర్శకంగా వుండండి" అని భారత ప్రభుత్వ విద్యాశాఖ మంత్రి మౌలానా అజాద్‌గారు విశ్వభారతిని కేంద్ర విశ్వ విద్యాలయంగా ప్రారంభిస్తూ సుడివారు.

శాంతినికేతనమునందలి మామిడి తోపులో వేద మంత్రముల పఠనము తోను, శంఖాల మోతతోను ఈ ఉత్సవం ప్రారంభమైంది. విశ్వవిద్యాలయాచార్యులగు పండిత నెహ్రూగారు, అధ్యక్షుడు డా॥ రాజేంద్ర ప్రసాద్‌గారు, కేంద్ర మంత్రులు, వ. బెంగాలు గవర్నరు, ముఖ్యమంత్రి ఉత్సవం జయప్రదంగా జరుగుగాక, అని సందేశాలు పంపారు. చాలామంది ప్రముఖులు, పూర్వ విద్యార్థులు ఉత్సవంలో పాల్గొన్నారు.

విశ్వవిద్యాలయాన్ని ప్రారంభిస్తూ మౌలానా అజాదుగారు ఇలా అన్నారు: విశ్వవిద్యాలయ చట్టం చేయడంతో మీ చరిత్రలో నూతనదశ ప్రారంభమైంది. మీది అపూర్వమైన సంస్థఅని మీరు జ్ఞాపక ముంచుకోవాలి. ఇతరవిశ్వవిద్యాలయాల చేస్తున్న పనినే మీరుగూడ చేయకుండా వాటికి మార్గ దర్శకులుగా వుండాలి. మహోన్నతములైన గురుదేవుని ఆశయాలను మీరు అనుసరించాలిగాని ఇతర విద్యాసంస్థల ఆశయాలను ఆధారాలను అనుసరించ కూడదు. మీ సంస్థ పాఠ్యక్రమము మన ఆశయాలకు చాలా దగ్గరగా వున్నది కనుక గురుదేవులు విశ్వభారతి కొసంగిన సందేశాన్ని ఇతరులు అవలంబించేటట్లు చేయడానికి మీరు కృషిచేయాలి. ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతులకు ఒక సంగమ స్థానముచేయదలచినే వుద్దేశ్యంలో ఈ సంస్థను శ్రీ॥ రవీంద్రనాథ్ టాగూరుగారు స్థాపించారు. ఈ సంస్థ మొదటి నుంచి అపూర్వమైనదే. నవీన పాశ్చాత్యవిజ్ఞానాన్ని ప్రాచీన భారత విజ్ఞానంతో మేళవించడం వల్లనే ఈ సంస్థకు ఇటి అపూర్వత యేర్పడింది. ప్రాచీనవిజ్ఞానాన్ని రక్షించే కొన్ని సంస్థలు దేశంలో వున్నా అవి నవీన పాశ్చాత్య విజ్ఞానాన్ని బహిష్కరిస్తున్నవి. ఈకాలపు రీతి అని పూర్వకాలపు సంస్థలకు పక్కలని చెప్పవచ్చు. నవీనమైన సందేశాన్ని అవి యివ్వడం లేదు. దేశంలో వున్న యితర విద్యాసంస్థలు ప్రభుత్వోద్యోగులను తయారుచేసినవి. బ్రిటిషు ప్రభుత్వము వారి గుమాస్తాలు అవసరమగుటచేత వారు ఈ పాఠశాలలను కళాశాలలను యేర్పరిచారు. విజ్ఞానాన్ని వ్యాపింపజేసేందుకు వీటిని యేర్పరచలేదు. ప్రాచీన భారత విజ్ఞానాన్ని పోషిస్తూ, దానితోబాటు కాలానుగుణములగు మార్పులు చేసికొన్న సంస్థలు దేశంలో లేవు. ఇది ఒక్కటే. ప్రాచీన భారత విజ్ఞానాభిమాని, నవీన పాశ్చాత్య శాస్త్ర విజ్ఞానాభిమాని అయిన గురుదేవులు ఈ రీతిని మేళవించే సంస్థను యేర్పరిచారు. మహత్తరమైన గురుదేవుని ఆశయాలను మీరు పోషించి రక్షిస్తారని ఆసిస్తున్నాను."

## నవంబరు 1-వ తేదీన సమ్మె బాలెట్

హైదరాబాదు, సెప్టెంబరు 22: యస్. యస్. రైల్వే ఉద్యోగుల యూనియన్ కేంద్ర కౌన్సిలు వారు ఇవాళ రాత్రి ఇక్కడ సమావేశమై, 6 గంటలసేపు చర్చలు జరిపి, చివరకు అధికారులు గనుక తొలగా తమకోర్కెలను తీర్చకపోయినట్లయితే, నవంబరు 1 వ తేదీనాడు సమ్మె బాలెటు తీసుకోవడానికి నిశ్చయించారు.

యస్. యస్. రైల్వేకు జి. ఐ. పి. రైల్వేతో విలీనం చేయటంపట్ల తమ అభ్యంతరాలను కూడా కొన్నింటిని వారు వెల్లడించారు. అటువంటి విలీనము చేసేముందర యూనియన్‌ను సంప్రతించి మరీ చేయవలసిందని రైల్వే మంత్రివర్గాన్ని కోరారు.

## జార్జిరాజుకు రాజెన్ బాబు సందేశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 23: భారతాధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ బ్రిటిష్ రాజు 6 వ జార్జికి నేడీ క్రింది విధంగా ఒక సందేశం పంపారు:

"మీ అనారోగ్యవార్త మా కందరికీ తీవ్రమైన ఆందోళన కలిగిస్తున్నది. అచిరకాలంలోనే మీరు మళ్లీ పూర్తిగా ఆరోగ్యం పొందగలరని మేం మంచిపరమూ హృదయపూర్వకంగా ఆశిస్తున్నాము."

# తూర్పు బెంగాలులో సరిహద్దుల సవరణ

## పార్లమెంటులో డా॥ కేస్కార్ వివరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 21: పశ్చిమ బెంగాలు అస్సాం, త్రిపురాలకూ తూర్పు బెంగాలుకూవున్న సరిహద్దులను నిర్ణయించే ప్రయత్నం ఎంతవరకు వచ్చింది, ఈ కార్యక్రమంలో ఇంతవరకు ఏయేప్రాంతాలను తూర్పు బెంగాలుతో తాము పరటా చేసుకున్నదీ విదేశాంగశాఖ సహాయమంత్రి డా॥ బి. వి. కేస్కార్ పార్లమెంటులో ఈ వేళ వివరించారు.

"పశ్చిమ బెంగాలుకూ, తూర్పు బెంగాలుకూ మొత్తం 800 మైళ్ళ నిడివిగల సరిహద్దు వుంది. ఇందులో ఇంతవరకు 869 మైళ్లు సర్వే చేయబడ్డాయి. కాని హద్దులు ఏర్పరచడం ఒక 104 మైళ్ళ మేరకు మాత్రమే జరిగింది. పోతే యిక అస్సాం తూర్పు బెంగాలు సరిహద్దు విషయం. ఈ సరిహద్దువెంట గుర్తులు పాతడానికి వీలుగా ముందు సరిహద్దు కటువైపున 5 మైళ్ళ ప్రదేశాన్ని ఇటువైపున ఒక 5 మైళ్ళ ప్రదేశాన్ని విమానాలలోంచి ఫోటో తీ గారు. తూర్పు బెంగాలు త్రిపురా సరిహద్దుల నిర్ణయం యింకా ప్రారంభం కాలేదు.

పశ్చిమ బెంగాలు తూర్పు బెంగాలు సరిహద్దులోని ఈ క్రింది ప్రాంతాల విషయమై అంత్యనిర్ణయాలు యింకా జరగలేదు.

ఒకటి, ఇరవై నాలుగు పరగణాలకూ ఖుల్నా కూమధ్య సరిహద్దు.

రెండు, నాడియాకూ కుష్టియాకూ మధ్య సరిహద్దు.

మూడు, మాల్డా, రాజషాహీ సరిహద్దు.

నాలుగు, జల్పైగురీ, దినాజ్పూర్ సరిహద్దు. పరటా చేసుకొన్న ప్రాంతాలు:

ఒకటి, బేరుభాయ్‌నగర్ పాకిస్తాన్‌కు బదిలీ చేయబడింది.

రెండు, బేరుచాటార్, ఖాయిపాలా ఇండియా తీసుకుంది.

మూడు, బేజా ఖురుండాంగాలో కొంతభాగం పాకిస్తానుకు ఇవ్వబడింది.

నాలుగు, బేజానుల్తాన్‌పూర్ లో ఒకభాగం ఇండియాకు పరటా ఇవ్వబడింది. పాటియాలా అరణ్యప్రాంతం గురించీ అనిశ్చితంగా వున్న ఇతర సరిహద్దు ప్రాంతాల గురించీ ఇండియా పాకిస్తాన్లకు ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి.

డి. వి. కర్మార్కర్ గారు ఒక సభ్యునికి లిఖితపూర్వకంగా సమాధానం ఇస్తూ, 1951 లో మేలిరకం మాంగనీసు ఖనిజం మొత్తం 10 లక్షల టన్నులదాకా ఎగుమతి చేయనివ్వవచ్చునని భారత ప్రభుత్వం నిర్ణయించిందనీ నాసిరకం ఖనిజం ఎగుమతికి పరిమితిఅంటూ ఏమీ విధించబడలేదనీ తెలియజేశారు.

ప్రభుత్వం తాము సెలకొల్పిన పోత ఇంజను యంత్రాగారంలో ఒక భాగాన్ని ఒక ప్రైవేటు కంపెనీతోకలిసి జాయింటుగా నిర్వహించడానికి అంగీకరించిందని, బురాగా హైన్ గారు వెల్లడించారు.

"పాకిస్థాన్‌లోని కాందిశీక ఆస్తి సంరక్షకులు కాందిశీకుల ఆస్తిని అన్యాయంగా తిప్పికవరలకు అమ్మివేస్తున్నారని భారత ప్రభుత్వానికి ఫిర్యాదులు వచ్చాయి. భారతప్రభుత్వం యీ ఫిర్యాదులను గురించి పాకిస్తాన్ ప్రభుత్వంతో చర్చించింది. అక్రమాలు జరిగినవని తోచినప్పుడు ఆ కాలంలో ఫిర్యాదులు చేసుకుంటే తాము వాటిని విచారించగలమని పాకిస్తాన్ ప్రభుత్వం సమాధానం ఇచ్చింది" అని ఎ. కె. జైన్ గారు వెల్లడించారు.

టిబ్బత్‌లోని రాయబార కార్యాలయాన్ని మూసివేయాలనే ఆలోచన ప్రభుత్వానికి లేదని డా॥ బి. వి. కేస్కార్ గారు చెప్పారు.

# అమెరికా కాంగ్రెసు: టాస్ విలేఖరులు

## వార్తాపత్రికాసంపాదకుల అభ్యర్థనకు కాంగ్రెసునిరాకరణ

వాషింగ్టన్, సెప్టెంబరు 21: సోవియట్ వార్తా సంస్థ 'టాస్' ప్రతినిధులు అమెరికా కాంగ్రెసు సమావేశాలకు హాజరై, కాంగ్రెసు వార్తలు పంపకుండా నిషేధించవలని అమెరికా వార్తాపత్రికా సంపాదకుల సంఘం గతరాత్రి కాంగ్రెసు ఉపసంఘాన్ని తిరిగి అభ్యర్థించినది.

ఈ విషయంలో ఎట్టిచర్యలు జరపడానికి విదేశాంగశాఖ నిరాకరించినది. అందువల్ల వార్తాపత్రికా సంపాదకుల సంఘం కాంగ్రెసుకు అనుబంధంగా ఉన్న పత్రికా రచయితల సంఘాన్ని ప్రత్యేకంగా అభ్యర్థించినది. కాంగ్రెసు పత్రికా రచయితల సంఘం ఈ అభ్యర్థనను పరిశీలించి, కాంగ్రెసు ప్రెస్ గ్యాలరీలోనికి టాస్ ప్రతినిధులను ఇక ముందు కూడా రానివ్వడానికి నిశ్చయించినది. సోవియట్ ప్రతినిధులను నిషేధించడంవల్ల పత్రికలకు చేకూరే ప్రయోజనమేమీ లేదని మాచిస్తూ, విదేశాంగ వ్యవహారాలలో జోక్యం చేసుకోవడానికి ఇష్టంలేదని ఆ సంఘం ప్రకటించినది. ఈ సందర్భంలో చేసిన తీర్మానం పూర్తిపాఠం సోవియట్ పత్రికలకు పంపడానికి టాస్ సంఘం 'టాస్'కు అధికారం ఇచ్చినది.

# "ప్రేమ చిత్తముతో ప్రజావిత్త చోరుడను"

## వినోబాభావే భూదాన యజ్ఞ యాత్ర

సింగోడీ, (చింద్వారా) సెప్టెంబరు 21: భూములు లేనట్టి వారికి భూవసతులను కల్పించుటకై వినోబాభావే గారు భూస్వాములవద్దనుండి భూములను దానముగా తీసికొనుచు ఉత్తరదేశ మంతటను కాలినడకను పర్యటనం చేస్తున్నారు. నిన్న ఉదయము చింద్వారానుండి 8 గం॥ లకు ప్రాతఃకాల ప్రార్థనానంతరము బయలుదేరి 18 మైళ్లు నడచి సింగోడీ అనే గ్రామానికి చేరారు. త్రోవలో [illegible] మైళ్లు నడిచేసరికి సాహ్నా అనే గ్రామంవద్ద ఆచటి పాఠశాలలోని పిల్లలును తదితర గ్రామస్థులును ఆయనకు స్వాగతమిచ్చారు. తాను ఏ ఉద్యమమును సాగించుచున్నాడో వారికి వివరించి చెప్పెను. భూములులేని వారికి భూములను పంచిపెట్టడంకోసం తాను భూదానాలకై గ్రామాలు తిరుగుచున్నానని చెప్పెను. 4 గురు వ్యవసాయకులు 31½ యకరాలు యిచ్చారు.

ఆ గ్రామానికి 2 మైళ్లు ఎగువన బొంగ్నాను అనే గ్రామంలో రోడ్డు ప్రక్కన 70 మంది ఆయనకొరకు నిరీక్షిస్తున్నారు. వారిని చూచి వినోబాభావేగారు యిలా అన్నారు. "నేను ప్రేమచిత్తముతో మీ విత్తమును హరించడానికి వచ్చాను. భగవంతుడు గాలి, నీరు, ఏ విధంగా అందరూ అనుభవించే నిమిత్తము సృష్టి చేసియున్నాడో అదేవిధంగా భూమిని కూడా సృష్టించియున్నాడు. సొంతభూమి అనేది లేనిజనులు లక్షలకొలదిగా యీదేశంలో ఉన్నారు. అట్టివారు ఉన్నంతకాలము భారతదేశానికి శాంతిఉండదు. అందువల్ల భూములు లేనివాండ్లకొరకై భూదానములను యాచించేనిమిత్తమై దేశమంతటను పర్యటనం చేయడానికి నేను నిశ్చయించుకున్నాను. భూసమస్య అనేది రష్యాలో జరిగినట్లుగా చైనాలో జరిగినట్లుగా కేవలం హింసాత్మకమైన విప్లవంవల్లగాని, లేదా శాసనం మూలంగా గాని పరిష్కారం కావాలి. మొదటి హింసా పద్ధతిని మన హృదయంలోనికి ప్రవేశింపనీయరాదు. రెండో పద్ధతి అనగా శాసనబద్ధమైనభూవిభజన సమర్థమైనది కాదు. హృదయపూర్వకమైనఅనురాగాదరణములతో పేదజనానికి భూమిని పంచియిచ్చేది పద్ధతి చాలా ప్రశస్తమైనది. అందులోఉన్నంత ప్రభావం ఇంకెందులోను లేదు. వినోబాభావే గారు గ్రామస్థులను స్వయంగా "భాయి! భాయి!" అని భుజాలమీద చేతులువేసి భూదానం చేయండి అని ప్రతిమాలుచున్నారు. ఈ గ్రామంలో 10½ యకరాలు సంపాదించారు.

అక్కడినుండి భావేగారు ముందు నడిచిపోవుచుండగా ప్రక్క గ్రామంలోని వారు ముగ్గురు అక్కడఆయన కొరకై కూర్చుండి యుండిరి. వారు ఆయన పాదాలమీదపడి నమస్కరించారు. వారిలో ఒకడు అడగ్గానే ఒక యకరంభూమిని యిచ్చాడు.

ఆయన సింగోడీ చేరగానే ఆయనకు ఎదురుకొలు స్వాగతింగా 50 మంది భజనచేస్తూ జయ జయ నినాదాలు చేస్తూవచ్చారు. ఆరోజు వినోబాభావే గారు సింగోడీలోనే మకాము వేశారు. ఆయన అక్కడకు చేరిన ఒక గంటలోనే ఆయన అకస్మాత్తుగా మాయమైనారు. ఆయన ఎవరితోనూ చెప్పకుండా గ్రామంలోకి వెళ్ళారు. గ్రామంలోని ప్రతియింటికి హిందువు, ముసల్మాను, జైయిన్లు (మార్వాడీలు) యిండ్లకువెళ్లారు. ఆరోగ్య విషయములను గూర్చి, పరిశుభ్రతనుగూర్చి వారికి చెప్పారు. ఒక హరిజనునిఇంట్లో వినోబాభావే [illegible] విశ్రమించారు. ఆ చర్మకారునితో [illegible]. సాయంకాలము కొంత సేపు నూలువడికిన పిమ్మట, గ్రామస్థుల సమావేశంలో వినోబా భావేగారు ప్రసంగించారు. గ్రామస్థులు తమ జీవితావసరాలకు బయటిగ్రామాలను ఆశ్రయించుకొని ఉండవద్దనిన్ని గ్రామస్థులు సహకారపద్ధతుల ననుసరించి జీవించడం నేర్చుకోవలెననిన్ని చెప్పారు. రాట్నంత్రిప్పి నూలువడకవలెననీ, ఇంటిలోని పనిపాటలందు మొగవాళ్ళు స్త్రీలకు తోడ్పడి పని చేస్తూ ఉండవలెనని చెప్పారు. ప్రపంచంలోని భూమిపైశాల్యం స్థిరంగానే ఉండిగాని జనసంఖ్య వృద్ధిఅవుతోంది. అటువంటి సందర్భంలో భూమియూ [illegible] సంభవిస్తుంది? [illegible] ఏదీ సంభవించకుండా ఉండాలంటే సొంత భూమిలేని పేదవారికి పంచి యిచ్చే నిమిత్తమై భూమిగలవారు దానంచెయ్యాలి అని హెచ్చరించారు. 35 మంది గ్రామస్థులు ఒకరితర్వాత యింకొకరు సభలోలేచి మొత్తము 76 యకరాలు దానం చేశారు. దానం చేసిన వారిలో 7 గురు ముసల్మానులు కూడా ఉన్నారు. నేటి ఒక్క రోజులో మొత్తము 91 యకరాలు వినోబా భావేగారు సంపాదించారు. నేటి ప్రార్థనలతో కార్యక్రమం ముగిసింది. రేపు మాద్యారాను బయలుదేరి పోతున్నారు.

## ఆచార్య వినోబాభావే ఉద్బోధ

అమరావతి (మధ్యప్రదేశ్), సెప్టెంబరు 21: "ప్రజలే తమ సమస్యలు పరిష్కరించుకోవాలి [illegible] పోతున్నారు. ప్రజల సమస్యలను నేను పరిష్కరింప బోవడం లేదు. ఆ సమస్యల పరిష్కారానికి అనుకూలమైన వాతావరణం ఏర్పడేటట్లు చేయడానికి మాత్రమే ప్రయత్నిస్తున్నాను" అని ఆచార్య వినోబాభావే నేడిక్కడ ప్రకటించారు. భూదాన యజ్ఞంగురించి వ్యాఖ్యానిస్తూ ఆయన ఇంకా ఇలా చెప్పారు: "కమ్యూనిస్టులలో ఒక్క విషయంలో మాత్రమే నేను ఏకీభవించడం లేదు. తమ లక్ష్యాలను సాధించడానికి వారు హింసాత్మకమైన పద్ధతులు కూడా అవలంబిస్తారు. హింసతో నిమిత్తం లేకుండా, భూములు పునర్విభజించ వలసిన ఆవశ్యకత ప్రజలు గుర్తించేటట్లు చేయడానికే నేను కృషి చేస్తున్నాను. హైదరాబాదులో నూరు ఎకరాలకన్న ఎక్కువ భూమి ఎవరికీ వుండకూడదని నేను సూచించాను. కాని ఆ విషయం లోకూడా కొంతవరకు సమాధానపడక తప్పిందికాదు. ప్రజలందరికి భూమి ఉండాలనే నేను కోరుతున్నాను.

"హైదరాబాదులో ప్రతి కుటుంబానికి ఒక ఎకరం పల్లపుభూమి కాని అయిదు ఎకరాల మెట్టభూమి కాని ఉండాలని నేను చెప్పాను. హైదరాబాదు ప్రభుత్వం వలెనే మధ్యప్రదేశ్ ప్రభుత్వం కూడా భూమి పునర్విభజించడానికి ఒక సంఘం నియమించవలసి ఉన్నదని భావిస్తున్నాను. భూస్వాములు తమంతతాము భూదానం చేసినట్లయితే వారు నష్టపరిహారం కాంచించడం లేదని స్పష్టమవుతుంది."

# రాబోయే ఎన్నికలు: అహ్మదాబాద్ నుండి శ్రీ మౌలంకర్ పోటీ

అహ్మదాబాదు, సెప్టెంబరు 21: అహ్మదాబాద్ నియోజకవర్గంనుండి ప్రజాప్రతినిధుల సభకు కాంగ్రెసు అభ్యర్థిగా పోటీ చేయడానికి పార్లమెంటు అధ్యక్షుడు శ్రీ జి. వి. మవ్‌లంకర్ దరఖాస్తు పెట్టుకున్నారు. ఆయనతో ఇతర పక్షాల అభ్యర్థులు కాని, ఇతరులుకాని పోటీ చేయక పోవచ్చు.

శ్రీ గుల్జారీలాల్ నందా, శ్రీ ఖండుభాయ్ దేశాయ్ ఉత్తర గుజరాత్ నుండి ప్రజాప్రతినిధుల సభకు పోటీ చేయనున్నారు.

సూరత్ జిల్లానుండి రాష్ట్ర శాసన సభకు పోటీ చేయడానికి బొంబాయి హోంశాఖామంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ దరఖాస్తు పెట్టుకున్నారు. ఇప్పటికీ బొంబాయిరాష్ట్ర శాసనసభా సభ్యులలో ప్రదేశ్ కాంగ్రెసు సంఘ కార్యదర్శి శ్రీ భోగీలాల్ లాలా మినహాగా తక్కిన్నవారు అందరు కాంగ్రెసు అభ్యర్థులుగా పోటీ చేయడానికి దరఖాస్తులు పెట్టుకున్నారు.

పశ్చిమ బెంగాల్ ప్రముఖ మంత్రి డాక్టర్ బి. సి. రాయ్ రాష్ట్ర శాసన సభకు పోటీ చేయనున్నారు. ఆయన తన నామినేషన్ పత్రాలను రాష్ట్ర కాంగ్రెసు సంఘానికి సమర్పించారు. వాటిని కాంగ్రెసు కేంద్ర ఎన్నికల సంఘానికి పంపడం జరుగుతుంది. డా॥ బి. సి. రాయ్ కేంద్ర ఎన్నికల సంఘ సభ్యుడు.

గాంగ్రెసు కార్యనిర్వాహక వర్గ సభ్యుడు శ్రీ శంకర రావ్ దేవ్ ఎన్నికలలో పోటీ చేయడం లేదని వార్తాలో ప్రకటించారు.

## ఎన్నికలలో డాక్టర్ డి. ఎస్. పరచురే పోటీ

గ్వాలియర్, సెప్టెంబరు 21: గాంధీ హత్యకేసు ముద్దాయిలలో ఒకరైన డాక్టర్ డి. ఎస్. పరచురే హిందూ మహాసభ అభ్యర్థిగా లష్కర్ నియోజక వర్గం నుండి మధ్య భారత్ శాసన సభ ఎన్నికలలో పోటీ చేయనున్నారు.

# అలహాబాద్ నుంచి నెహ్రూ పోటీ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 22: వచ్చే ఎన్నికలలో ప్రధాని నెహ్రూగారు రెండు స్థానాలను అలహాబాదు నుండి ప్రజాసభకు పోటీ చేయవచ్చునని తెలుస్తున్నది. ఆయన ఇంకా కాంగ్రెసు టిక్కెట్టుకు దరఖాస్తు పెట్టలేదట.

## వెనుకబడ్డ జాతుల అభ్యర్థులు

గుంటూరు, సెప్టెంబరు 18: జనరల్ ఎన్నికలలో ఆంధ్రరాష్ట్ర వెనుకబడ్డ జాతుల సంఘం తరఫున పోటీ చేయదలచినవారు రు. 15-0-0 రుసుముతో, అక్టోబరు 10 లోగా తమ దరఖాస్తులను కొవరకొండ హనుమంతరావు, కార్యదర్శి, ఆం. రా. వె. జా. సంఘం ఆనందతీర్థ అగ్రహారం, గుంటూరు చిరునామాకు పంపాలి.

# 'విదేశవ్యాపార నిర్బంధాలను సడలించాలి'

## ఫ్రాన్సు సూచన

జెనీవా, సెప్టెంబర్ 21: అంతర్జాతీయ వ్యాపార నియమాల ఒప్పందంలో పాల్గొంటున్న 30 దేశాలకు ఫ్రాన్సు నిన్న ఒక విజ్ఞప్తి చేస్తూ ఆ దేశాలన్నీ విదేశీ దిగుమతులపై విధించే సుంకాలను తగ్గించాలని సూచించింది.

ధరలను తగ్గించటానికీ, తద్వారా ప్రజల జీవితస్థాయిని పెంచటానికీ గాను వివిధదేశాలూ ఏడాదికి 10% చొప్పున మూడేళ్లలో 30% సుంకాలను తగ్గించాలని ఫ్రెంచి వాణిజ్య మంత్రి ప్లెవెన్ హెచ్చరించారు.

# సింహళానికి బట్టల ఎగుమతి నిషేధం

## సింహళ ప్రభుత్వం ఆక్షేపణ తెలియపరచినదట

కొలంబో, సెప్టెంబరు 22: ఇక ఈ సంవత్సరాంతం వరకు సింహళానికి బట్ట ఎగుమతి నిషేధిస్తూ భారత ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వుపై సింహళ ప్రభుత్వం తన ఆక్షేపణ తెలియపరచినట్లు 'డెయిలీ న్యూస్' పత్రిక ఈ రోజున ప్రకటించినది.

కొన్ని దేశాలకు బట్టలు ఎగుమతి చేయకూడదని భారతదేశం నిషేధించినది. వాటిలో సింహళం కూడా ఉన్నది. ఇండియాతో వాణిజ్య ఒడంబడిక జరుపుకోవని దేశాలలో సింహళం ఒకటి. అందుచేత భారత ప్రభుత్వం నిర్ణయంవల్ల సింహళానికి ఇబ్బంది కలుగుతుందని ఆ పత్రిక ప్రకటించినది. సింహళానికి అవసరమైన బట్టలలో నూటికి 60 వంతులకు పైగా ఇండియా నుండి దిగుమతి చేస్తున్నట్లు సూచిస్తూ, ఈ విషయాన్ని పరిగణించకుండా ఇండియా అంతు విధించినదని 'డెయిలీ న్యూస్' విమర్శించినది. ఈ అంతు లోగడ ఇచ్చిన ఆర్డర్లకు కూడా వర్తిస్తుంది కనుక ఇది వ్యాపార సంబంధాలకు కూడా విరుద్ధమైన చర్యఅని ఆ పత్రిక అధిక్షేపించినది.

సింహళ ప్రభుత్వం ఆక్షేపణ తెలియపరచలేదనీ, ఈ నిషేధం సింహళానికి వర్తించకుండా చేయమని మాత్రమే భారత ప్రభుత్వాన్ని అభ్యర్థించినదనీ ఇక్కడి అభిజ్ఞవర్గాలువారు చెబుతున్నారు.

## సింహళ పౌరసత్వాలకు భారతీయుల దరఖాస్తులు

కొలంబో, సెప్టెంబరు 21: "సింహళ పౌరసత్వాలకై భారతీయులు పెట్టుకున్న దరఖాస్తులలో ఎక్కువ భాగం ఇంకా మూలపడి ఉన్నవి. తత్సంబంధమైన పరిశోధన సత్వరమే ముగించడానికి ప్రభుత్వం మరి కొందరు అధికారులను నియమించనున్నద"ని సింహళ విదేశాంగ శాఖామంత్రి సర్ ఆలివర్ గూనెతిల్లకే నేడు సెనేట్‌లో ప్రకటించారు.

# ప్రధాని నెహ్రూ పై డి. పి. మిశ్రా విమర్శ

జబ్బల్‌పూరు, సెప్టెంబరు 21: మహాకోసల కాంగ్రెసు సంఘ కార్యనిర్వాహకవర్గం ఈ రోజున సమావేశమై, కాంగ్రెసు సంస్థను, పండిత నెహ్రూను తీవ్రంగా విమర్శిస్తు శ్రీ డి. పి. మిశ్రా ఇటీవల చేసిన ప్రకటన పట్ల అసమ్మతి వెలిబుచ్చినది. సేఠ్ గోవిందదాస్ సమావేశానికి అధ్యక్షత వహించారు.

ఈ సందర్భంలో కార్యనిర్వాహక వర్గం చేసిన తీర్మానంలో ఇలా ఉన్నది:- "కాంగ్రెసు సభ్యత్వానికి, మంత్రిత్వానికి రాజీనామా సమర్పించిన తరువాత శ్రీ మిశ్రా కొన్ని ప్రకటనలు చేశారు. వాటిలో శ్రీ మిశ్రా వెలిబుచ్చిన భావాలతో ఈ కార్యవర్గం కాని, కాంగ్రెసు వాదులు కాని ఏమాత్రము ఏకీభవించడం లేదని స్పష్టపరచ గోరుతున్నాము." కార్యనిర్వాహక వర్గ సమావేశంలో మధ్యప్రదేశ్ ప్రముఖమంత్రి పండిత రవిశంకర శుక్లా కూడా పాల్గొన్నారు.

# జిన్నా సోదరి రేడియో ప్రసంగంలో కత్తిరింపు

కరాచీ, సెప్టెంబర్ 21: సెప్టెంబర్ 11వ తేదీన జిన్నా వర్థంతి సందర్భంలో ఆయన సోదరి ఫతీమా జిన్నా పాకిస్థాన్ రేడియోలో చేసిన ప్రసంగంలో కొన్ని భాగాలను రేడియో అధికారులు కావాలని కత్తిరించినట్లు ఆమె ఆరోపించినది. ఈ విషయమై అధికారులకూ, తనకూ జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలను ఆమె నేడు బహిరంగ పరిచినది.

ఆమె ఆరోజున మొత్తం 15 నిమిషాలసేపు ప్రసంగించగా అందులో ఒకసారి ఒక నిమిషంసేపూ, మరికొంత సేపటికి మరి ఒకటిన్నర నిమిషం సేపూ ఆమె స్వరం శ్రోతలకు వినిపించకుండా పోయింది. ఇట్లా ప్రసంగ భాగాలు వినిపించకుండా పోయిన విషయాన్నీ, దానిమీద జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలను స్వతంత్రపత్రికలయిన 'ఈవెనింగ్ టైమ్స్' ఇంగ్లీష్ (ఉర్దూ) మాత్రం ప్రకటించినవి.

కత్తిరించబడిన భాగాలు పాక్ ప్రభుత్వ విధానాలపై విమర్శలని ఈవెనింగ్ టైమ్స్ పత్రిక వ్రాస్తూ, ఈక్రింది వాక్యాలు అట్లా కత్తిరించబడినవాటిలో కొన్ని అని ఉదహరించింది.

"కాయిదేఆజం మరణ కాలానికి దేశాన్ని ఎదుర్కొంటున్న సమస్యలు ఇప్పటికికూడా ఎటూ తేలకుండా ఉన్నవని చెప్పటానికి చింతతో కష్టపడుతున్నాను. ఈనాటి విధానంలో దూరదృష్టి, మన నైర్మల్యల స్థానంలో అనిశ్చితపరిస్థితి, నిలకడ లేమి అనేవి కనిపిస్తున్నవి."

ఫతీమా జిన్నా, రేడియో అధికారి బొఖారీలమధ్య జరిగిన ఈ లేఖ ప్రత్యుత్తరాల్లో, బొఖారీ తమ కొన్ని భాగాలను మినహాయించమని కోరగా తాను నిరాకరించినట్లూ, అధికారులు తనకు తెలియకుండా ప్రసంగభాగాలు వినిపించకుండాచేసి, తరువాత తాను ప్రక్కంచగా రేడియో యంత్రాలు కొత్త ఒకలీకంగా నెలకొల్పకపోవడం వలన వచ్చిందని సాకు చెప్పినట్లూ ఫతీమా జిన్నా ఆరోపించినది.

# 'కాశ్మీర్ సమస్యకు సామరస్యమే పరిష్కారమార్గం'

కరాచీ, సెప్టెంబరు 22: ఇండోనీషియా మాజీ ప్రధాని డా॥ సుల్తాన్ షారీర్ నేటిరాత్రి యిక్కడ పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తూ, "ఇద్దరు వ్యక్తుల మధ్యగానీ, రెండు దేశాల మధ్యగానీ వివాదవచ్చినప్పుడు, సామరస్యసాధనమ్యాలే అందుకు పరిష్కారమార్గమని ఉద్ఘాటించారు. కాశ్మీర్ విషయంలో రాయబారాలూ మధ్యవర్తిత్వమూ విఫలమైనాయి గనుక, పరిష్కర్తృత్వం కంటే ఇక సమస్యాపరిష్కారానికి వేరేమార్గాంతరం లేదు. ఈ అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తారా ఏకీభవించరా? అని ఒక విలేఖరి షారీర్‌ను నిలవదీసి అడగ్గా, అందుకాయన పై విధంగా సమాధానం ఇచ్చారు.

"ఏ వివాద అయినా సామరస్యం వల్లనే పరిష్కారం కావాలి. సామరస్యం లేనప్పుడు పరిష్కర్తృత్వం కూడా నిరుపయోగమే అవుతుంది." అని ఆయన వివరించారు.

పాకిస్తాన్ ప్రధాని లియాకతాలీ ఖాన్‌తో కాశ్మీర్ మొదలుగాగల అనేకవిషయాలగురించి తాను చర్చలు జరిపాననీ, రేపు ఢిల్లీ వెళ్లినప్పుడు పండిట్ నెహ్రూను కలుసుకొని ఆయనతో గూడా ఆయావిషయాలగురించి తాను చర్చించగలననీ, షారీర్ ప్రకటించాడు.

# 'అన్ని భాషారాష్ట్రాలు ఒకేసారి ఏర్పడాలి'

## హైద్రాబాదు విభజన అవసరమని కర్నాటక కాంగ్రెస్ అధ్యక్షుని ప్రకటన

బెంగుళూరు, సెప్టెంబరు 22: కర్ణాటక కాంగ్రెస్ అధ్యక్షుడు నిజలింగప్ప గారు నేడొక ప్రకటనచేస్తూ, స్వామి సీతారాం ప్రాయోపవేశం విరమించినందుకు సంతోషం వెల్లడించారు. అయితే స్వామీజీ ప్రాయోపవేశం విరమణ భాషా రాష్ట్రాల నిర్మాణం సమస్యను పరిష్కరించదు. కాని ఆ సమస్యను అందరిదృష్టికి తెస్తుందని అన్నారు. "న్యాయసమ్మతమని అంగీకరింపబడిన భాషా రాష్ట్రాల నిర్మాణమును ప్రజలుగాని, ప్రభుత్వంగాని యింకెంత మాత్రమూ నిర్లక్ష్యం చేయతగదు. ఇది క్రమంలా అందరినీబాధిస్తున్నది. కనుక దీనిని యెంతత్వరగా నయంచేస్తే అంతమంచిది." "భాషా రాష్ట్రాలన్నింటిని ఒకేసారిగా ఏర్పాటు చేస్తే మంచిది. గత 30 ఏండ్లుగా కాంగ్రెస్ సంస్థనిమిత్తం ఏర్పాటు చేసిన భాషా రాష్ట్రాలు ఎలాగూవుండనే వున్నవి. పోతే కొన్ని భాషాప్రాంతాలను గురించి మాత్రమే తగాదా ఉన్నది. కేంద్రప్రభుత్వం సరిహద్దు సంఘాన్ని యేర్పాటుచేసి తద్వారా యీ తగాదాను పరిష్కరించవచ్చు. సరిహద్దుసంఘ నిర్ణయాలను అమలు జరుపవచ్చు. ఈలోగా, యీ భాషా ప్రాంతాలపై హక్కు కోరేవారిప్రయోజనాలకు, హక్కులకు హానికరమైన యేచర్యలు జరుపరాదు."

హైదరాబాదు విషయం ప్రస్తావిస్తూ, "నామటుకు నేను హైద్రాబాద్‌ను విభజించి ఆయా పొరుగు భాషా రాష్ట్రాలతో కలిపివేయడం మంచిదనే అభిప్రాయపడుతున్నాను. అయితే సంస్థాన విభాగమన్నది, ఆ సంస్థానప్రజలకు సంబంధించినదేనన్న విషయం గమనించాను. వారు విభజన కోరితే, తప్పకుండా జరుగుతుంది" అని నిజలింగప్ప తమ ప్రకటనలో తెలిపారు. నిజలింగప్ప ప్రకటనగురించి హిందూపత్రిక బెంగుళూరు విలేఖరి యిలా వ్రాశాడు:

"ఆంధ్రులు స్వరాష్ట్రం కోసం తీవ్రంగా పట్టుబడుతున్నారంటే, కర్ణాటకులు, కేరళులు, మహారాష్ట్రులు కూడా స్వరాష్ట్రాలకోసం అంతతీవ్రంగానూ పట్టుబడుతున్నారని గ్రహించాలి. మలబార్ జిల్లాను విడిగొట్టి, కొచ్చిన్ తిరువాన్కూరులకలిపి కేరళరాష్ట్రాన్ని సులభంగా నిర్మించవచ్చు. అలాగే బొంబయిరాష్ట్రంలో ధార్వార్, బిజాపూర్, బెల్గాం కార్వారులను, మద్రాసు రాష్ట్రంలో రెండు కెనరాజిల్లాలను, బళ్లారిజిల్లాను మైసూర్ హద్దులను నిపెడినీ, మైసూర్ రాజప్రముఖుగా బెంగుళూరు రాజధానిగా కర్ణాటక రాష్ట్రాన్ని యేర్పాటు చేయవచ్చు. కొన్నిలతె యిటువైపు వారింతో యీ యేర్పాటును ఆమోదించే ఉన్నారు.

అలాకాక యిప్పుడు ఆంధ్రరాష్ట్రాన్ని మాత్రమే యేర్పాటు చేసేయెడల మద్రాసు రాష్ట్రంలోని వివాదగ్రస్తమైన ప్రాంతాల సమస్య మళ్లీ తలయెత్తుంది.

సరిహద్దుసంఘం వీటిభవిష్యత్తు నిర్ణయించేవరకు, వీటిజోలికి పోగూడదు.

ఏమైనా వెంటనే సరిహద్దు సంఘాన్ని యేర్పాటు చేయాలి. ఏర్పాటు చేయబోయే ఆయా భాషారాష్ట్రాల తాలూకు వివాదగ్రస్త ప్రాంతాలపై తమ తీర్పులను, ఆరునెలలలోగా అంతే కొత్త పార్లమెంటు యీరాష్ట్రాల నిర్మాణానికి అనుమతించేందుకు వీలుగా తమ తీర్పులను ప్రకటించాలని ఈ సరిహద్దు సంఘాన్ని ఆదేశించాలి" అని నిజలింగప్పగారు తమ ప్రకటనలో తెలిపారు.

# పర్షియా నూనె సమస్య పై సంప్రదింపులు

## వెంటనే ప్రారంభించాలన్న పర్షియాసూచనకు బ్రిటన్‌నిరాకరణ

టెహరాన్, సెప్టెంబరు 22: నూనె వివాదంమీద సంప్రదింపులను తిరిగి ప్రారంభించ వలసినదని పర్షియా నేడు బ్రిటనుకు సూచించినది. 15 రోజులలోపల సంప్రదింపులను బ్రిటన్‌ప్రారంభించకపోతే అబడాన్ కర్మాగారంలో ఉన్న బ్రిటిష్ సిబ్బందిని వెళ్ళగొట్టడం జరుగుతుందనే తుది హెచ్చరిక ప్రస్తావనే ఈ ప్రతిపాదనలో లేదు.

అయితే ఈ ప్రతిపాదనను నిరాకరించటానికే బ్రిటన్ నిశ్చయించుకున్నదని బ్రిటిషు విదేశాంగ కార్యాలయం నేడు లండన్‌లో ప్రకటించినది. పర్షియా ప్రతిపాదనలో క్రొత్త విషయమేమీ లేదనీ, సంప్రదింపులను మొదలు పెట్టటానికి ఆధారంగా చెప్పుకోతగ్గ విషయమేదీ ఆ ప్రతిపాదనలో లేదనీ బ్రిటిషు విదేశాంగ కార్యాలయం ప్రకటించినది.

పర్షియా ప్రతిపాదన మొదట టెహరాన్‌లో ఉన్న బ్రిటిష్ రాయబారికి అందజేయబడ్డది. ఆ తరవాత ప్రధాని మొసాదిక్ వేరే ఒక సందేశాన్ని లండనుకు పంపించారు. ఈ సందేశంవల్ల పర్షియా ప్రధాని వైఖరిలో ఏమీమార్పు రానట్లే కనిపిస్తున్నదని బ్రిటిషు విదేశాంగ కార్యాలయ ప్రకటన తెలియజేసినది.

## ప్రతిపాదన వివరాలు

మొసాదిక్ ప్రతిపాదనను బ్రిటిష్ రాయబారికి పంపేముందు పర్షియా రాజు దానిని చదివి ఆమోదించినట్లు తెలుస్తున్నది. ప్రెసిడెంట్ ట్రూమన్ ప్రత్యేక ప్రతినిధి హారిమన్‌ద్వారా పర్షియా పంపదలచిన సూచనలే ఈ సందేశంలో ఉన్నట్లు తెలుస్తున్నది. కొంతకాలంపాటు మధ్యవర్తిత్వం జరిపిన హారిమన్ పర్షియా ప్రతిపాదనలను బ్రిటనుకు అందజేయటానికి నిరాకరించారు. హారిమన్ నిరాకరణకు జవాబు ఇచ్చే విషయమై చర్చించటానికి పర్షియా మంత్రివర్గం నేటిరాత్రి సమావేశం కానున్నది.

హారిమన్‌ద్వారా తాను పంపదలచిన ప్రతిపాదనల్లో నూనె కంపెనీకి పర్షియా పరిహారం చెల్లిస్తాననీ, బ్రిటిష్ సొంత అవసరాలకు కావలసిన నూనె మాత్రం ఇస్తాననీ, ఫ్యాక్టరీ యాజమాన్యం పర్షియన్ చేతుల్లోనే ఉండాలనీ సూచించినది. వాటిని బ్రిటన్ అంగీకరింపదగినవిగా లేవని చెప్పివున్నది.

## షా శ్రద్ధ

ప్రతిపాదనలను బ్రిటనుకు అందజేయ నిరాకరించినందుకు హారిమన్‌కి పర్షియా ఇచ్చే జవాబునుగురించి మంత్రివర్గం తరువాత రాజు మహమ్మద్ షాతో సంప్రదించటంవల్లనూ, మొసాదిక్ పంపిన సరికొత్త సందేశాన్ని ఆయన మొదట ఆమోదించటం జరిగిందన్న వార్తలవల్లనూ, నూనెసమస్యలో ఆయన శ్రద్ధ తీసుకుంటున్నట్లు కనిపిస్తున్నది.

## తీవ్రచర్యలకు ముందు సామరస్య ప్రయత్నం

బ్రిటన్ నిరాకరణ తెలియటానికి కొంత ముందుగా ప్రధాని మొసాదిక్ అనుచరుడయిన డా॥ హుసేన్ ఫతేమీ నేడొక ప్రకటనచేస్తూ, తీవ్రచర్యలు తీసుకునేముందు, తిరిగి సంప్రదింపులు మొదలయ్యేట్లు చేయటానికి పర్షియా ప్రయత్నిస్తున్నదని అన్నారు. సామరస్యంగా సమాధానం కుదుర్చుకోవాలన్న సద్భావంతో ఈ మారొకసారి ప్రయత్నం చేస్తున్నామని ఆయన అన్నారు.

సంప్రదింపులు 15రోజుల్లో ప్రారంభం కాకపోతే బ్రిటిష్ సిబ్బందికి ఉద్వాసన చెపుతామన్న తుది హెచ్చరికను ఇచ్చే ఉద్దేశాన్ని పర్షియా మార్చుకోలేదనీ, అయితే కడపటి ప్రయత్నఫలితం తేలేవరకూ అది నిలుపుచేయబడినదనీ డాక్టరు ఫతేమీ అన్నారు.

పార్లమెంటులో మొసాదిక్ ప్రతికూలురు ఎక్కువవుతుండ అవుతున్నట్లు కనిపిస్తున్నది. ప్రతికూలపక్షసభ్యులకు 'హత్యసంఘాల' పేరుతో వారు దేశద్రోహులుగా నిర్ణయమై మరణదండన విధించబడ్డదని లేఖలువస్తున్నవి. కమ్యూనిస్టు టూడే వచ్చేవారంలో అధికారం చేజిక్కించుకోనడానికి కుట్రపన్నినట్లు అధికారవర్గాలు ఆరోపిస్తున్నారు. కాని వివరించడం లేదు. సోమవారంనాడు ఆపార్టీజరప దలచిన ఉత్సవాలను టెహరాన్‌లో నిషేధించారు.

## రెండునెలలలో ఎన్నికలు

నేటికి 2నెలల తరువాత పర్షియాలో ఎన్నికలు జరపవలెనన్న ఉత్తరువు మీద పర్షియారాజు నేడు సంతకం చేశారు.

అమెరికా కొత్తరాయబారి లాయ్ హెండర్సన్ నేడు ఢిల్లీనుంచి ఇక్కడికి వచ్చారు.

## రష్యాతో వాణిజ్య సంప్రతింపులు

పర్షియా, రష్యాలమధ్య వస్తుపరటా ఒప్పందాన్ని కుదుర్చుకునే నిమిత్తం వచ్చిన ఉభయ ప్రతినిధులూ నేడు మొదటిసారిగా సమావేశమైనారు. ఇంతకుముందు ఇటువంటి ఒప్పందం ఒకటి ఉభయదేశాల మధ్యనూ జరిగి ఉన్నది. ఈ ఒప్పందం చేసుకొనటానికి ఎప్పుడో కొన్ని సరకులు పెట్టినట్లు కన్నెర్ర టిప స్వతంత్ర 'ఫర్మాన్' చేసిన ఆరోపణలను అధికార వర్గాలు ఖండించారు.

# జార్జిరాజు అస్వస్థత

## బక్కింగ్‌హాం రాజభవనంలో వైద్యుల పరిశీలన

లండన్, సెప్టెంబరు 22: ఆరవ జార్జిరాజు వైద్యులలో అయిగురు ఈ రోజున గంటలతరబడి ఆయనవద్ద గడిపారు. కాని జార్జిరాజు కూపిరితిత్తులకు శస్త్రచికిత్స చేయలేదు. నేటి రాత్రి కూడా శస్త్రచికిత్స చేయరనే రాజభవనంలోనివారు చెబుతున్నారు. రోజంతా వేలకొలది ప్రజలు ఆందోళనతో రాజభవన ద్వారాలవద్ద గుమిగూడి ఉన్నారు.

అంతకుముందు జరిగిన వన్నాహాలనుబట్టి శస్త్రచికిత్స జరుగుతుందనే గోచరించినది. నర్సులు రాజభవనంలో ప్రవేశించారు. చికిత్సాపరికరాలు కూడా అక్కడికి చేర్చి, ఒకగదిలో శస్త్రచికిత్స చేయడానికి తగిన ఏర్పాట్లు చేశారు. సర్ రాబర్టు యంగ్, సర్ హోరెస్ ఇవాన్స్, సర్ డానియల్ డేవిస్, సర్ జాన్ వెయిర్ ఉదయం రాజును పరీక్షించి, శస్త్రచికిత్స చేయడానికి జరుగుతున్న ఏర్పాట్లను పరిశీలించారు. శస్త్ర చికిత్స చేయలేదంటూ ప్రకటన జరగడానికి ముందు ఎలిజబెత్ రాకుమారి బకింగ్‌హామ్ భవనం చేరుకున్నారు. మరికొలది నిమిషాలలో రాజమాత మేరీ రాణీ కూడా అక్కడికి వచ్చారు. రాజు రెండవ కుమార్తె మార్గరెట్ రాకుమారి స్కాట్లండునుండి విమానంలో నేటిరాత్రి లండను చేరుకున్నారు. జార్జి రాజు ఊపిరి తిత్తులకు జరిగే శస్త్రచికిత్స సఫలమై, ఆయన తిరిగి ఆరోగ్యం కోలుకోవాలని కోరుతూ దేశంలో ఉన్న చర్చిలన్నిటిలో ప్రత్యేకంగా ప్రార్థనలు జరపడానికి ఏర్పాట్లు చేస్తున్నారు.

# బొంబాయి పోలీస్ అధికారికి నోట్లకట్ట

## ఇచ్చిన వ్యక్తి అదృశ్యం

బొంబాయి, సెప్టెంబరు 2: నేడు ఒక వ్యక్తి బొంబాయి సి. ఐ. డి. ప్రధాన కార్యాలయంలో ఒక సుపరింటెండెంటును చూడవచ్చి, ఆతని నౌకరు చేతికి ఒక బంగీయిచ్చి కొన్ని నిమిషాలలో నేను తిరిగి వస్తాను అని వానితో చెప్పి అదృశ్యమైనాడు. కొన్ని గంటలైనా ఆతడు తిరిగి రాలేదు. బంగీ విప్పగా దానిలో 2,45,000 కరెన్సీనోట్లు వున్నవి. అందరు ఆశ్చర్యచకితులైనారు. ఈ డబ్బు గతవారం హాంకాంగ్ అండ్ షాంఘై బ్యాంకులో దొంగతనం ప్రాపి తీసుకొన్న 2,60,000 రూపాయల బాపతని పోలీసులు అనుకొంటున్నారు. ఈ కేసుకు సంబంధించి పోలీసులు 8 మందిని అరెస్టు చేసివుండిరి. కాని డబ్బుదొరకలేదు.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras.